ప్రథమ ముద్రణ కాలం :
సౌమ్య, శంకరజయంతి.

ప్రతులు :
వెయ్యి

హక్కులు :
రచయితవి

మూల్యం :
నాలుగు రూపాయలు

అక్షరశిల్పి :
శ్రీ శీలావీర్రాజు

ప్రచురణ :
ఆంధ్ర సారస్వత పరిషత్తు,
తిలక్ రోడ్, హైదరాబాదు.

ముద్రణ :
శివాజి ప్రెస్,
గంజ్ బజారు, సికిందరాబాదు.

# దర్శన

డాక్టర్ అరిపిరాల విశ్వం వయస్సులో నాకన్న చిన్నవాడు. కాని బుద్ధిలో, విద్యలో, పాండిత్యంలో, కవిత్వవిషయంలో అన్నిటా నాకన్న ఉన్నతుడు. అయినా నేను అతని కవితా సంకలనానికి పీఠిక వ్రాయడంలో కొంత ఔచిత్యం లేకపోలేదు. నేనంటే అతనికి ఒక రకమైన అభిమానం ఉంది ఉండవచ్చు; ఇరవై ముప్ఫయ్యేళ్ళుగా తెలుగుదేశంలో వస్తోన్న కవితా రీతులతోటీ— విశేషించీ ఆ యా మార్గాలలో ప్రముఖులైన కవులతోటీ— వారివారి కవిత్వాలతోటీ నాకుగల ప్రగాఢమైన పరిచయాన్నిబట్టి— నేను గొప్ప కవిత్వం చెప్పకపోయినా— అసలు కవిత్వాన్ని అర్థంచేసుకుని ఆనందించే స్వభావమైనా నాకున్నదని అతనికి అనిపించి ఉండవచ్చు. కారణాలు ఏవైనా నాకీ అవకాశాన్ని ఇచ్చినందుకు సోదరుడు విశ్వాన్ని 'మనస్సు'లోనే అభినందిస్తూ, అతని కవితా పరిశీలనకు ఉపక్రమిస్తాను.

నేటివరకు 'నిదురకన్నెలు' - 'కాలంగీస్తున్న గీతలు' - 'రేపటి స్వర్గం'— అనే పేర్లతో విశ్వానివి మూడు కావ్య సంపుటాలు వచ్చాయి. ఈ మూడింటిలోనూ కూడా కవి వచనకవితా ప్రక్రియనే స్వీకరించాడు. అయితే మరోప్రక్రియ నడపడం చేతకాకమాత్రం కాదు 'మైథిలీ వల్లభ శతకం' 'పృథ్వీశ్వర త్రిశతి', వంటి గ్రంథాల్లో ఈ కవికి ఛందస్సుపైగల ప్రభుత స్పష్టంగా గోచరిస్తుంది.

ఉదాహరణకి యీ పద్యాలు చూడండి.

పౌనః పున్యజనుర్మృతీ కలిత సంప్రాప్తోగ్ర బాధామతిన్
ఏనః పుంజము నెంత దాల్చితినొ పోయెఁ జేయిచీకట్లలో
లీనంబై బ్రతుకంత నీ కెదురు రాలేనోయి! నే నంధుడన్
శ్రీనిత్యోత్సవ చిద్విలాస పరమేష్ఠీమైథిలీ వల్లభా!

అస్మజ్జీవన గేహశీజ్వలిత దీపాంకూరముల్ దైన్యసం
విస్మర్తవ్య కథాప్రపంచమును లేపెఁ నిద్రలోనుండి - మై
థిస్మోల్లేపన పాండు దీధితులు పర్వెఁ నందిపై వచ్చు నీ
శా! స్మృత్యంకములో సతమ్ము నిలుమయ్యా! మైథిలీవల్లభా!

—మైథిలీవల్లభ శతకంనుంచి.

పూవుం దోటలు నీలి మబ్బులు మహాంభోరాశి నిర్ఘోషముల్
తావుల్ చిమ్మెడి దక్షిణానిలము - చెంతన్ చెట్లపై పక్షులుఁ

నీవున్నిల్తురు – యీ స్మశానభువిలో – నిర్నిద్రప్రేతాకృతుల్
ఏవో మంత్రము లుచ్చరింపఁగ – విషాహిగ్రీవ ! పృథ్వీశ్వరా !

ఇవె పొన్నల్ ప్రభుపాదపూజకయి – ఎన్నేండ్లిట్లుగా నిల్చెనో
ఇవె బిల్వద్రుమసంతనిల్ – చిగురుటాకే కన్నుగా బొల్చు ని
య్యవి మల్లీవకుళామ్రభూజములు ! పర్యాప్తాశ్రుమాలా – సుమా
లివి లేమబ్బులు కుంభ శీర్షములు – వ్రాలెన్ మ్రోల పృథ్వీశ్వరా !

—పృథ్వీశ్వరత్రిశతి నుంచి.

అలాగే ఈ సంకలనంలోనే ఆఖరున చేర్చిన 'తాండవహేల' లోనూ తదితర గీతాల్లోనూ కవి నిర్వహించిన మాత్రాచ్ఛందాల తీరు ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. మొత్తంమీద ఏరూపంలో నైనా సరే కవిత పలుకగలనేర్పు కవికి పుష్కలంగా ఉంది. అయితే ఎక్కడో వెయ్యిసంద్రాల లోతుగా పవ్వళించిన స్మృతులను కదల్చడానికి వచనకవితనే సాధనంగా స్వీకరించాడు. ఈ విషయాన్ని మాత్రం మనం విస్మరించకూడదు.

పోతే విప్లవాత్మకమైన వచనకవితను ఆశ్రయించిన అధునాతనులు అనాది పురుషుడైన పరమేశ్వరుని తమ కవితలో కీర్తించడానికి ఇష్టపడరు. నేడు పుంఖానుపుంఖంగా వస్తోన్న వచన కవితా ఖండికల్లో నాగరిక జీవనచిత్రణమే ప్రధాన వస్తువుగా ఉన్నట్టు కనిపిస్తుంది. ఒక్క విశ్వం మాత్రమే ఇంతటి అధునాతన ప్రక్రియలోనూ అనాది సిద్ధమైన జగజ్జీవేశ్వర అనుభూతికి నిత్య నూతనమైన అభివ్యక్తిని కల్పించడానికి ప్రయత్నిస్తున్నాడు.

'దేవుడున్నాడని నమ్మే మార్క్సిస్టుని నేను' అని కాబోలు ఒక సభలో విశ్వం అన్నట్లు జ్ఞాపకం. 'అటువంటి మార్క్సిజమేదైనా ఉంటే మేమూ మార్క్సిస్టులమే' అని మిత్రులు దేవుల పల్లి రామానుజరావుగారు చమత్కరించారు. మొత్తంమీద విశ్వం 'దేవుడున్నాడని నమ్మే మార్క్సిస్టు' కనుక వచనకవితలో అవేలమైన తన భక్తిభావనను అడుగడుగునా ప్రకటిస్తాడు. బహుశః ఇదే మిగిలిన వచనకవులలో లేనిదీ విశ్వంలో ఉన్నదీ అయిన ప్రత్యేక లక్షణం కూడా కావచ్చు. ఈ రకమైన ప్రత్యేకత ఇంచుమించు విశ్వం కలంపట్టి వ్రాయడం మొదలు పెట్టిన మొదటి కవిత దగ్గరనుంచీ ఉందేమో కూడా !

ఇది మొదట్లో కవిలో ప్రకృతి పరిశీలనా శక్తిగానే అంకురించింది. 'కాలం గీస్తున్న గీతలు' అనే కావ్య సంపుటిలోని 'విపథగీతం'లో 'చిరుమబ్బులు రెండు గాలిపక్షి రెక్కల్లా' కదులుతున్నాయి అనడం— 'చెట్లుచేమలు, కొండకోనలు సగంమేనిపై అస్తమిత సూర్యదీప్తి సౌవర్ణాంబరాలను' కట్టి మిగిలిన సగాన్ని చీకటి దిగంబరత్వంగా మార్చిందనడం వంటి వెన్నో అతని ప్రకృతి పరిశీలనాశక్తికి నిదర్శనాలు. కాని 'మనస్' అనే ఈ సంపుటిలోని కవియొక్క మనస్సు మరింత పండి, పరిపక్వమై ఆ ప్రకృతిలో సర్వేసర్వత్రా నిండి ఉన్న పరమేశ్వరాంశని

కూడా సందర్శింపగలుగుతున్నది. అంటే కాలం గీస్తున్న గీతలు నాటికి కేవలం Nature Poet గానే ఉన్న 'విశ్వం' 'మనస్' దగ్గరకు వచ్చేసరికి Mystic Poet గా పరిణతి చెందాడన్నమాట.

Mystic అనే పదానికి నైఘంటికార్థం ఇలా ఉన్నది :

One who sees by contemplation and self surrender to obtain union with or absorption into the diety or who belives in the spiritual apprehension of truths inacccessible to the understanding.

మొత్తంమీద మిస్టిసిజమంటే ఆత్మార్పణం ; పరతత్త్వముపై విశ్వాసమేకాని హేతు జిజ్ఞాస లేకపోవడం.

స్థూలంగా ఈ లక్షణాలన్నీ విశ్వానికీ అతని కవిత్వానికీ ఉన్నట్లే తోస్తుంది. అతడు ముందు భక్తుడు; తర్వాత కవి. అందుకే అతని ప్రత్యక్షరంలోనూ భక్తిభావం తొంగి చూస్తుంది.

ప్రపంచంలోని చరాచర సర్వస్వంలోనూ, తిర్యగ్జంతు సమస్తంలోనూ పరమాత్మని దర్శించగలగడమే మిస్టిసిజం యొక్క మూల సూత్రం.

‹Nature is but a name for an effect whose cause is God.'

అన్న సత్యాన్ని గ్రహించి ఆ ప్రకృతిని పరిశీలిస్తే అందుకు కారణభూతుడైన పరమేశ్వరుని సందర్శించినట్టే.

మల్లె మొగ్గ నునుసిగ్గులోంచీ
చల్లని పిల్లగాలి ఊదే
వెదురు పిల్లనగ్రోవి వెనుకనించీ
జారిపడే జలతారు వెన్నెల సెలయేటి ఒడ్డునించీ
కరిగిపడే పొగమంచు అంచునుంచీ
మబ్బు పొదలమాటునుంచీ
అలాగే
మెరుపుతీగె కొసనుంచీ"

ప్రకృతిలో అంతర్లీనంగా నిండి ఉన్న పరమేశ్వర స్వరూపాన్ని సందర్శించి కవి తన్మయీభావాన్ని ప్రకటిస్తాడు.

ఈ తాత్త్వికచింతన కవి తెచ్చిపెట్టుకున్న దేమీ కాదు. అది జీవిత పరిణామంలో క్రమక్రమాగతంగానే అతడికి సిద్ధించినది. దీనికంతకీ అతడియొక్క బాల్యమూ— పుట్టిపెరిగిన వాతావరణమూ అన్నీ కారణాలు.

'మా ఊరు' అన్న ఖండికలోనూ, 'ఎప్పుడో చిన్నప్పుడు' అన్న ఖండికలోనూ ఈ విషయం బాగా స్పష్టపడుతుంది. అతడు పుట్టిన ఊరు ఎటువంటిదీ :

శివుడు విడిసినచోటు-భవుడు అడుగిడుచోటు
ఉమకు నచ్చినచోటు-సురలు మెచ్చినచోటు

అంతేకాదు

మా ఊరు దేవునితోట అంచెలంచెల దివికి ఉయ్యాల.

అటువంటి వాతావరణంలో అతని బాల్యం సాగింది. అందుకే—

ఒక్క స్వర్గము తప్ప అచట పుట్టితిమనుటయే గొప్ప అని మురిసిపోతాడు. జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపిగరీయసి అనికదా పూర్వోక్తి!

ఎప్పుడో చిన్నప్పుడు గుడి దేవరగడపమీద దీపమై వెలిగినాడట! బడి పుస్తకాల్ని చించి కాగితపు కత్తిపడవలు కైలాసానికి పంపినాడట! కనుకనే ఇప్పుడూ తాను 'శివునికోసం జపిస్తాను' అంటాడు. ఈ జపమే అతని కవితలో తాత్త్విక చింతనాపరమైన ఆకృతిని దాల్చింది.

వేదాలనుంచి, ఉపనిషత్తులనుంచి, నారదభక్తి సూత్రాలదగ్గరనుంచి అనుస్యూతంగా వస్తున్న తాత్త్విక కవితయొక్క లోతుపాతులను కూడా బాగా తరిచి చూచినవాడు విశ్వం. ఇందుకు అతడు డాక్టరేటుపట్టంకోసమై వ్రాసి సమర్పించిన పరిశోధక గ్రంథంలో కొన్నిచోట్ల బలమైన సాక్ష్యాలు దొరుకుతాయి. ఇంతకీ చెప్పవచ్చేదేమంటే విశ్వం కవితలో కాన్పించే తాత్త్వికచింతన కేవలం యాదృచ్ఛికమైనది కాదనీ, దాని వేళ్ళు అతని భౌతిక ఆంతరంగిక జీవితాలలో బాగా బలంగా నాటుకుని ఉన్నవే అనీని!

భగవద్భావన లేకుండా ఒంటిగా ఎంతకాలం జీవించినా సృష్టి రహస్యం బోధపడదనీ— కేవలం దైవ కృపవలననే క్రాంతదర్శనం కలుగుతుందనీ విశ్వం విశ్వాసం. ఇది 'నీలాంటి ఒకరిని' అన్న ఖండికలో ధ్వనిస్తుంది.

భయాల చీకటి గుహలో పట్టుబడిపోయాను
నా ఏకాంతపుగుహలో దిగులుతో మిగిలిపోయాను

పిలవకుండా వచ్చిన అతిథివి
నీ అంతట నీవే వెదుక్కుంటూ వచ్చావు

కళ్ళల్లో కడలేని సృష్టి సౌందర్యాన్ని కురిపించావు
ఎప్పటికీ నాకంటి వెలుగులా నిలిచిపో

నీలాంటి ఒకరిని నేనింతవరకూ చూడలేదు

అన్న వాక్యాలలో 'తమ సోమాజ్యోతిర్గమయ' వంటి ఉపనిషద్వాక్యాల అంతరార్థం కూడా స్ఫురిస్తుంది.

పరిచయం విరచించిన పారవశ్యంలో— చేయి చాపిన చిరంతన ఏకత్వంలో— మనసులో మిగిలిన ఒకలాంటి మంచితనంలో— తరంగాల వెలుగులు నిండిన ఆంతరిక స్పందనలో"— ఛాయలా అనంత దిగంతాల్లోనూ తన హృదంతరంలోనూ ప్రకాశించే పరమాత్మ తేజస్సువెంట పయనించడమే తాత్త్వికుని జీవితలక్ష్యం. ఈ లక్ష్యం గుండెలోని ఎండమావులువంటి ఖండికల్లో ప్రతిఫలిస్తున్నట్లు తోస్తుంది.

సృష్టి సర్వమూ తపస్స్వచ్ఛతకూ, భక్తిప్రపత్తికీ గుర్తు. 'ఇంద్రధనుస్సు తెగిపోయి' అన్న ఖండికలో యుగాంత అతిధిగా మూర్తిగొన్న పరమేశ్వరుణ్ణి ఎలా పసి కడతాడో చూడండి. ఆయన 'కాలాన్ని గంధంగా పూసుకొని వెన్నెల్ని విసనకర్రగా విసురుకుంటున్నాడట!" మబ్బుతేరు దిగి మనసుపడి రావాలవి వచ్చాడట! ఋతువుల హారతుల్ని స్వీకరిస్తున్నాడట! తారకలు అతనిచుట్టూ తారట్లాడుతున్నాయట కన్నుల్లో కారుణ్యపు వెన్నెల విరుస్తున్నదట! విశ్వరూప సందర్శనం చేస్తున్నాడు కవి— ఎంత ధన్యుడు!

తేజస్వియైన పరమాత్ముని రాకకొరకు నిరీక్షించే జీవుని వేదనకూడా తాత్త్విక కవితకు ప్రాణభూతం.

యుగాల ఎడబాటుని
ఊర్పుల సవ్వడిలో కలిపేసినప్పుడు

నా యీ ఏకాంతసౌధానికి
ఎందరెందరో్నే రమ్మని
ఆహ్వానాలు పంపినప్పుడు—

ఎంతో వ్యధ తర్వాత— ఎంతో వ్యవధి తర్వాత అన్ని అవధుల్నీ దాటి కాంతివేణువుని ఊదుకొంటూ స్వాంతాన్ని వెలిగిస్తూ ఆ పరమేశ్వరుడు వచ్చిన జాడ తప్ప ఆ వచ్చిన ఇంటికి ఒక విలాసమే లేకపోతుంది; పరమేశ్వరానుభూతి కలుగగానే జీవునికి విస్మృతికలిగినట్లు! జీవునియొక్క జన్మజన్మాల నిరీక్షణా, జీవైక్యమూ కాంతివర్షం అన్న ఖండికలో కనిపిస్తాయి.

'మనస్' అన్న ఖండికలో ఈ భక్తిభావం పరాకాష్టనందుకున్నది. ఆగికోలేక వ్యంగ్య మర్యాదను కూడా విసర్జించి" నందనందనా! ఆనందస్యందనా! నా మనోస్పందనా! "ఇందీవరశ్యామ! అని ఆక్రోశించిగాని! ఊరట పొందలేకపోతాడు కవి." చెట్టుచేమలు తప్ప— చేల గట్టులు తప్ప— కొండకోనలు తప్ప— చుట్టాలంటూ లేరు— చుట్టూదరిజేర నీరు"— అని తన ఆర్తినంతా వెళ్ళబోసుకుంటాడు. 'గాలి ఒక్కటి తప్ప నా చెక్కులెవరూ నిమురరు' అని వెర్రిగా వాపోతాడు. లోకమే కాని తనకూ ఆయనకూ మధ్య అడ్డు మరేదీలేదని గుర్తిస్తాడు. 'నీవు

అందరికీ ఏలికవు' అని పరమేశ్వరుని సార్వభౌమత్వాన్ని గ్రహిస్తాడు. కుండపోతగా మారిన తన బ్రతుకుని ఆ పరమేశ్వరుని పాదాల మ్రోల క్రుమ్మరిస్తాడు.

ఇలా ఈ గ్రంథంలో ఆసాంతం విభిన్నమైన ప్రకృతి చిత్రాలనుంచి పరతత్త్వచింతనా పరమైన ఏకత్వాన్ని కవిత్వంలో సాధిస్తాడు విశ్వం.

డిలాన్‌థామస్ కాబోలు ఒకచోట అంటాడు—

"Out of the conflict of images, I try to make that momentary peace which is called a poem" అని.

ఇదిగో ఈ రకమైన Conflicting images తో నిండిన కవిత్వలావణ్యం ఈ గ్రంథ మంతటిలోనూ తొణికిసలాడుతుంది.

ఇందలి కవిత యావత్తు ఆత్మాశ్రయరీతిలో సాగింది. ఆత్మాశ్రయరీతికి కవియొక్క స్వీయానుభూతి ప్రాణం. అసలు కవిత్వానికే అనుభూతినిమించిన నిర్వచనంలేదని నమ్మేవాళ్ళల్లో విశ్వం ఒకడు. అందుకే ఇందులోని భక్తిగాని, రక్తిగాని, సుఖంగాని, దుఃఖంగాని కవియే స్వయంగా అనుభవించి సుందరంగా కవిత్వంలో పొదిగాడు. కవియే కవితకు ఆలంబన విభావము.

'ఉత్తమమైన ఆత్మపరమైన కావ్యంలో ఉన్నంత కవిత్వలావణ్యం మరొక కావ్యంలో ఉండదు' అని కొందరి మతం. ఆ దృష్టితోచూస్తే అటువంటి కవిత్వలావణ్యం ఈ ఖండిక లన్నిటిలోనూ భాసిస్తుంది.

చివరికి ఒక్కమాట :

మహాశక్తి సమన్వితుడైన పరమేశ్వరుని అన్వేషించే మార్గం బహుగుహ్యం ; గోపనీయము. భక్తులైనవారికి మాత్రమే మౌనవ్యాఖ్యచే అది సువిదితమౌతుందని పెద్దలంటారు. అటువంటి మార్గమేదో ఇందులో విశ్వం ప్రవక్త లాగా నిలబడి మనకి ప్రబోధిస్తున్నాడని పెద్ద పెద్ద మాటల్లో చెప్పలేనుకాని—

ఒక విజ్ఞుడు చెప్పినట్లు :

"Poets write not to tell others, but to discover and understand for themselves."

అని మాత్రం చెప్పగలను ; ఇందులో కవి అయిన విశ్వం యొక్క తాత్త్వికచింతనా పరమైన సాధనామార్గం కనిపిస్తున్నదని స్పష్టంగా చెప్పగలను !

—శశాంక.

# అంకితం

మా అన్న

## గుంటూరు శేషేంద్రశర్మకు

ఒక ఎప్పటి మన చెలిమికి గుర్తుగా - ఒకనేటి మన హృదయపు కలిమికి గుర్తుగా
ఒక ఎన్ని విడిపోయిన బాటలోమరల - ఒక్క పిలుపుదగ్గర నిలిచిన గుర్తుగా

ఒక ఎన్నిముడి వీడని ఊహలో మరల - ఒక్కనిన్ను ఒక్కనన్ను
ప్రక్కప్రక్కన నిలిపిన గుర్తుగా

వేసేందుకు హారాలులేవు - యీ కవితాకల్హారాలు
గుండె అంచున అమృతనీహారాలు తప్ప
మోసేందుకు భారాలులేవు - యీ సుమనః
స్వప్నసురభిళాలు దించుకొన్నచోటున

అందాన్ని - డెందాన్ని - అప్సరోబృందాన్ని - ఆనందకందాన్ని
నా హృదయస్పందాన్ని - సుధలు నించిన సౌవర్ణ భాండాన్ని - స్వర్గసౌందర్యాన్ని

నా యీ కవితానందనాన్ని - ఊహాహయాలు పూన్చిన - ఉజ్జ్వలాత్మస్యందనాన్ని

నీ లోని మధురిమ - నింపుకొన్న మనస్సు - కిది
నాలోని జిలుగు వెన్నెల ప్రజ్ఞకురియించిన పయస్సు

నీలోని భావనావిధురిమ కిది -
నాలోని కలత కన్నుల కలల పూలమాల యిది
నీలోని కూలంకషరోచిర్నివహానికి -
నాలోని ఒడ్డులొరయు హృదయేంద్ర చాపమిది

ఒక నీవు సదయనేత్రపు కాంతి సంగీతానివి -
ఒకనేను హృదయపాత్రిక అంచులొరయు అమృతస్వప్నమరీచికను

ఇది నా కవితా తపస్సు పండించిన - చలిత లలిత సారసదళ మాలిక
ఇది నాలోని జీవునివేదన నిండించిన - జలద శకల నీలోపమ నిస్తుల

ఒక తల్లికన్న బిడ్డలము కాము : పుడమితల్లి బిడ్డలము మనము
అందులో ఏమున్నది ? అన్నవు నీవు అనుంగు తమ్ముడను నేను

నాకై నేనే కృతియివ్వాలన్న యిష్టము. నీకై నీవే అడిగిపుచ్చుకొన్న అదృష్టము
నీ రసజ్ఞతా సౌధానికి సోపానాలులేవు. నీవు ధిషణాకషణాంచిత దీవ్యన్మతివి

కవిసమ్రాట్టు నా గురువు కలిపిపెట్టిన గోరుముద్దల కవితాబాల్యం నాది
కవి సార్వభౌముడు : లోకాభిరాముడు నా అన్న బుజ్జగించి పజ్జనుత్రిప్పే కవితాయౌవనంనాది

వెలుగుల యేరుగా కురుస్తుంది : వెన్నెల జాలుగా పరుస్తుంది

ఇది కవిత్వం అవునోకాదో : నాకు తెలియాల్సిన పనిలేదు
ఒక్కటి మాత్రం తెలుసు : ఒక్కటి మాత్రం నిలుచు

ఐదంయుగీన ఆంతరిక విప్లవాత్మ నికేతనమిది : నవసృష్టి సంకేతమిది
అనిదంపూర్వ నిర్నిగదితనిస్తుల నీహారజ్వాల ఇది : కల్హారమాల ఇది

అందుకో నా గుండె గూటిలోని భావవిహంగికను
నీ మనసుతోటల తిరగనీ : పులకించి తన యెదపాడగా

# మీతో ఒకమాట . . .

ఈ 'మనస్' లో నా వేదనని నించాను. తపస్‌ను పంచాను. జీవితపు బొమ్మని— చేతనైనంత అందంగా దించాను. జిలుగునీ, వెలుగునీ— దీపపు సెమ్మలా వెలిగించాను. నాలాంటి ఒకరిని అవతల నిలబెట్టి— కవితలో నడిపించాను. నేను కాని నేనును అందులో— రంగులా నిలిపాను.

కవిత్వానికి నిర్వచనం చెప్పలేను. ఆంతరిక స్పందన, చిలికిన పలుకులివి. దీన్ని ఏమైనా అనండి. ఇది నా 'మనస్', మీ మనసు లోతుల్ని ఎప్పుడైనా ఎక్కడైనా వెలిగించగలిగితే నా యీ ప్రయత్నం. ఒక అర్ధవంతమైనదేనని భావిస్తాను. కాకపోతే— అంతంలేని యీ యాత్ర ఇంకా సాగాలని— నిరవధికంగా ఇంకా పట్టుదలగా సాగిస్తాను. నాకోసం నేను చేస్తున్న యీ ఆంతరిక యాత్ర తాలూకు వెలుగు నీడల బొమ్మ ఇది. మలుపు తిరిగిన, మసక మసక జ్ఞాపకాల వెన్నెల నీడ ఇది. మంచూ - వెన్నెలా వయసూ - వసంతం - నిలువెత్తు ఊహలు - జగత్తు గుండెలోని స్పందన— ఏదో అద్వైతానుభూతి— నాలో నన్నే-- వెదుక్కునే రీతి ఇది.

నాపైన అపార స్నేహతరంగాల్ని వెలయించిన నా స్నేహ బృందం శ్రీ కె. మురళీధర్, డాక్టర్ జి. రాములు, డాక్టర్ సి. బి. ప్రకాశరావు, శ్రీకాకుళం రాధాస్వామి, టి. యస్. యన్. స్వామి గార్లకు నా కృతజ్ఞతలు.

నా సుహృన్మణులు, శివాజీ ప్రెస్ యజమానులు శ్రీ బడేసాహెబ్, కోటేశ్వరరావుగార్లకు నమస్కృతులు.

ఇకనుంచి యీ 'మనస్' మీది.

మీ వాడు
'విశ్వం'

# మా వూరు

మనసు దోసిట స్వర్గమౌ నాడు
మనిషిగా పసివాడి నానాడు

ఒకనాడు ఈమదికి అడ్డులులేవు
ఒకనాడు ఈనదికి ఒడ్డులులేవు

ఆనాడు అసలు కాలపులెక్కలే లేవు
ఆనాడు మెసలు కలలకు తెక్కలే లేవు

ఆనాడు కలత కన్నుల వెన్నెలే కురిసె
ఆనాడు జలతరంగిణి గుండెలో మొరసె

ఒకవీధి పొగడచెట్లకు నీడలము మేము
ఒకవీధి మట్టిచెట్లకు ఊడలము మేము

ఒక పరాగము ఎందుకో తోచె
ఒక సమీరము డెందమై వీచె

ఒక మిళిందము - వందనందనము లందునా
ఒక రసానంద తుందిలమ్మూహ లందునా

ఎప్పుడూ ఎడతెగని వసంతమప్పుడు
ఎప్పుడూ కడలేని అమృతమ్మప్పుడు

ఎప్పుడూ ఇసుక తిన్నెలవోలె మెత్తని క్రొత్తకోర్కెలు పరచె
ఎప్పుడూ అలల కన్నులవోలె ఎత్తగు చిత్త మూహలు పరచె

ఎప్పుడూ చెట్లకొమ్మల కోయిలలమైన మావూరు
ఎప్పుడూ పూలసందుల పుప్పొడులమైన మావూరు

ఎప్పుడూ రంగురంగుల చిట్టిపిట్టలమైన మావూరు
ఎప్పుడూ కొంగుముడిలో స్వర్గమైతోచు మావూరు

ఎప్పుడూ చేలసందుల చిన్నగాలులమై తిరిగాము
ఎప్పుడూ నేలడిగ్గిన ఇంద్రచాపమై పెరిగాము

ఎప్పుడోతప్ప మాకు తోచదీ లోకపురీతి
ఎప్పుడూ విప్పు మాదు గొంతుకలోన నాకపుగీతి

మావూరు దేవునితోట మంచివెన్నెల మంచు ఉయ్యాల
మావూరు దేవునితోట అంచెలంచెల దివికి ఉయ్యాల

శివుడు విడిసినచోటు - భవుడు అడుగిడుచోటు
ఉమకు నచ్చినచోటు - సురలు మెచ్చినచోటు

మాకు తెలియదు అప్పుడీ మనుషుల తీరు
మాకు తెలిసినదొక్కటే మావూరి యేరు

మేము రాజుల మొక్కింతకాము. ఏనుగులపై తిరిగాము
మేము రాజులప్రక్కనైనాలేము - పల్లకీ ఎక్కి ఊరేగాము

మాకు రాజ్యపుపెల్లలేలేవు. ఏటిగట్టున తిన్నెలేచాలు
మాకు రాజ్యముతోనె పనిలేదు. ఏటి ఒడిలో ఇంత ఉండిన చాలు

ఎందరెందరి ఊహాలో ఎగసె నీయూర
అందమంతయు తానుగా ముగిసె నీయూర

ఒక్క స్వర్గము తప్ప అచట పుట్టితిమనుటయే గొప్ప
ఒక్క దేవుడుతప్ప అచట మెట్టితిమనుటయే గొప్ప

మాకు ఉల్లమున్నదికాని కల్లలులేవు
మాకు చల్లనిమది ఉన్నదికాని దానికి ఎల్లలులేవు

ఏటి కెదురీత ఒక్కటి నిజమునాడు. బ్రతుకుపద్ధతి బోధపడలేదు మాకు
నీటికాకులవోలె మున్గితిమి నాడు. ఎండమావుల గూర్చిన బాధపడలేదు

మా వూరి మఱ్ఱిచెట్టుకొమ్మలలోన
జివ్వుజివ్వున తెక్కలార్చు పిట్టలమౌచు -

మావూరి ఏటిపాయల పాటిరేవులు పడని యప్పుడు
మాపురేపుల ఎగరేసిన పడవ తెరచాపల మప్పుడు

వెన్నెలను వంటిపై పూసుకొని - అమృతాన్ని ఉమిసిన రోజులు
కన్నులను మింటిపై బరపుకొని - ఱిక్కలము మేమెయని భ్రమసిన రోజులు

జీవితానికి అర్థమే చెప్పుకొను పనిలేదు
భవితవ్యమే మను వ్యర్థమగు ఊహసనలేదు

అందమేతప్ప బ్రతుకు కన్వేషణము లేదు
స్పందనే తప్ప మనసు నిద్దురపోవుటే లేదు

అలలు - చిరుగాలిలో కదలి ఒడ్డులొరసిన కాలము
కలలు - మురిపాలుగా మెదలి గుండె లొరసిన కాలము

ఈల పాటల బ్రతుకు ఏల పాటల బ్రతుకు జోలపాటల బ్రతుకు

జాలిపాటలు సాధువుల తంబురాలో తప్ప విన్పడవు
నీలి మబ్బుల రంగు తప్ప నలుపుకీ విషాదానికి అస్తిత్వం లేదు

చాల అనుకున్న రోజులవి జరగాలన్న మోజులేదు
ఏదో గడచిపోయినా - మనసు అంచును విడిచిపోని రోజులు

అర్థాలు వెదకటం చేతకాకపోయినా అందంగా గడచిపోయిన రోజులు

అప్పటి సంగతులే వేరు సాయంత్రాలే వేరు
అప్పటి ప్రశాంతతే వేరు ఆరనిదాహమే వేరు

మాకు గురువెవ్వరూ లేరు ఏరు తప్ప

ఊపిరి కదలికలవెంట - మనసు పాటలవెంట
ఏటి తరగలవెంట - ఎక్కడో క్రుంకుతున్న సూర్యుడి ఎరుపు చీలికలవెంట
ఒంటరిగాపోతున్న లంకదారుల వెంట

కలలు కదలినట్లు - కలవరం మెదలినట్లు - బ్రతుకు పుణ్యంప్రోవుపడ్డట్లు
ఎండమావుల్లోని ఎర్రతనంలో కలిసి - ఎక్కడికో కొట్టుకుపోయే వాళ్ళం

దానిలో ఏదో మత్తు ఉంది మహత్తు ఉంది

అప్పుడు ఎర్రని పూల పెదవులు మాకెన్నో నేర్పాయి

ఓర్పుని-ఓదార్పుని-ఆలోచనని-ఆశని-ఎడబాటుని-ఎదురుచూడటాన్ని
ఎడతెగని నమ్మకాన్ని - ఇంతలేసి ఎదదలో చివరి మజిలీబొమ్మని

నది మమ్మల్ని పిలిచింది - ఎదవిచ్చి రమ్మంది
చక్కని సాయంత్రాన్ని సరిగంచు ఉత్తరీయంగా కప్పుకొమ్మంది
మనస్సుని నగ్నంగా చేయమంది - తనలో మగ్నంగా చేయమంది

మిమ్మల్నింతింతగాచేసే స్వంత కష్టాలని - స్వాంతంలోని వేదనలుగా
మార్చవద్దంది
వాటిని సరిగమలు చేయమంది సావేరిరాగం పాడమంది

బరువూ-అలసటా-బాధా-బంధాలని విడిచి
మనుషులై లోకంలో మసలమంది

ఎప్పుడో చిన్నప్పుడు మావూరు
ఎప్పుడూ ఉన్న గురువు మాయేరు

# కాంతివర్షం

ఎప్పటివో జ్ఞాపకాలు
ఎడదపైన కాంతివర్షాన్ని కురిసినప్పుడు

ఎవరిదో బాష్పస్నపిత కజ్జలనేత్రం
వసంతపు ఒంటరితనాన్ని గుర్తుచేసినప్పుడు

యుగాల ఎడబాటుని
ఊర్పుల సవ్వడిలో కలిపేసినప్పుడు

నా యీ ఏకాంత సౌధానికి
ఎందరెందరోన్నో రమ్మని
ఆహ్వానాలు పంపినప్పుడు

నాలోని చీకటి పొంగి
చికాకుగా ఆవరించింది

ఇంతవ్యధ తర్వాత
ఇంతవ్యవధి తర్వాత

ఇన్ని అవధుల్ని దాటి
ఎవరో నా కోసం
వెదుక్కుంటూ తప్పక వస్తారన్న
ఆశ అంతరించినప్పుడు

బరువు బ్రతుకు తప్ప
నాకేమి మిగిలింది ?

కాంతివేణువుని ఊదేవెవరు నీవు ?
స్వాంతంలో వెలిగే దెవరు నీవు ?

నేనెప్పుడూ నీకోసం పిలవలేదు
నేనెప్పుడూ నీకోసం నిలవలేదు

కైలాసం నా యింటిముందరకు
కదలిరాలేదు

కజ్జల బాష్పధారతప్ప గంగానది
యీ ప్రాంతాల ప్రవహించలేదు

నిన్ను తలవనేలేదు
అయినా
నన్ను దయతలచావెవరు నీవు ?

కాంతిని కురిసి - కన్నీటిని తుడిచేశావ్ ?
నీ పజ్జనుంటేచాలని ఏడ్చే
ఎందరోన్నో విడిచిపెట్టి
నా పజ్జను చేరావు

అందుకే
నీవు వచ్చావన్న జాడతప్ప
నాయింటికో విలాసంలేదు

# గుండె అంచున వసంతం

గుండె అంచున వసంతం పూయనేలేదు
కళ్ళల్లో-నామనసు గూళ్ళల్లో-దీపాలజ్ఞాపకాలు వెలగనేలేదు

కోర్కెల అంచున కొసరికొసరి కొత్తకోయిల కూయనే లేదు
యీ మన విడిపోయేవేళ - యిప్పుడే గుర్తుకొస్తోంది

గాలిలోని నిశ్శబ్దం కదలి కదలి
గుబులై కంటితుదిలో కూర్చుంటోంది

నీకళ్ళు స్వర్గపునకళ్ళు
నే వెతుక్కునే క్రొత్తలోకపు వాకిళ్ళు

వెన్నెల సెలయేటిలో వెళ్ళిపోయే చాతకాలు
ఎందరి మనసుమూలలో మార్చివేసిన జాతకాలు

ఇంకా ఒంటరితనపు గట్టున ఓరచూపు వదలనేలేదు
నన్ను రమ్మని పిలవనేలేదు

యుగం ముగింపుకు వస్తున్నట్లు
అక్కడెక్కడో అంతరాత్మ వీధుల్లో
ఆగిఆగి ఉరుముల సవ్వడి
జగం యిక సాగలేనని మూల్గిన - బాధ

చివరిసారి నా కెక్కడినుంచో
పిలుపువస్తుందని చెవులోగాలి చెప్పిన రహస్యాలు

ఇంకా పరిహాసాల బారినుండి బయటపడనివ్వలేదు
చెప్పేందుకేమీలేదు

విప్పిన యీ కనురెప్పల తప్పకపడియున్న కాటుకమబ్బులు
కురువలేవు-అమృతవర్షాన్ని-నాపై హర్షాన్ని
అందుకే నేడీ బ్రతుకైంది చెప్పటం-విప్పటం చేతకాని నిశ్శబ్దనిరీక్షణ

# మనస్

ఊరు స్యందన
ఏరు స్పందన
పేరు నందన

చెట్టుచేమలు తప్ప
చేలగట్టులు తప్ప

కొండకోనలు తప్ప
చుట్టాలంటూ లేరు
చుట్టూ దరిజేర నీరు

గాలి ఒక్కటి తప్ప
జాలిగా నా చెక్కులెవరూ నిమురరు

జోలె ఒక్కటి తప్ప
జాలిగా నా వెంట ఎవరూతిరగరు

''నందనందనా !
ఆనంద స్యందనా !

నా మనోస్పందనా !
ఇందీవరశ్యామ ! !

ఎందు దాగితివోయి
డెందమున నిల్వవో!

కందొవను వెల్గుగా
అని—

అప్పుడప్పుడు బృందావనానికి
ఎప్పుడైనా మధురానగరికి

ఉప్పెనలా పోయే భక్తులు
తప్పక నీపేరు పిలుస్తారు

అందులో నా పేరుకూడ తలుస్తారు
ఎప్పటికైనా నీ ఊరదేననిపిస్తారు

నీ వందరికీ ఏలికవు
నీ బిడ్డను నేను హరిజన బాలికను

గొట్టెమేకలు తప్ప పరిజనం లేరు నాకు
లోకమేకాని నాకింక అడ్డులేదు

ఒక్క నేనే ఉంటి
ఒక్క కాలే కుంటి

గ్రుడ్డిదాన నైతే నేమి
నామదికి ఒడ్డులులేవు

మూగికూడ నేను
గుండెతో తప్ప రాగాలు పాడలేను

కొద్దిగా అవిటిని నేను
రవ్వంత చెవిటిని నేను

ఒకకాలు మానాన్న గుడిలో
మిగిలింది ఒక్కకాలే పుడమి అమ్మ ఒడిలో

గుడి మంటపం నుండి
మానాన్న 'నందనందనుడు'
ఎప్పుడూ రాత్రివేళ ఊరేగుతాడు

అందరూ ఆయన పాదాలదగ్గర చుట్టుకుంటారు

అక్కడెక్కడో మట్టిచెట్టు తిన్నెక్రింద
బిక్కుమనే దిగులు చుక్కలా నిదురదోగుతాను
నన్ను మానాన్న దరికే పోనివ్వరు
గుడి నీడకే రానివ్వరు

వాళ్ళంతా భక్తులు
మానాన్న మీద అనురక్తులు

వాళ్ళంతా మనుషులు
దేవుడిపై నిలిపిన మనసులు

వాళ్ళంతా చూస్తున్నప్పుడు
నాన్ననైనా ముట్టరాదు నేను

మట్టి ప్రమిదెలో దీపమైనా పెట్టనీరు
పుట్టుగ్రుడ్డిని హారతినైనా ఎత్తనీరు

ఊరు స్యందన
ఏరు స్పందన
పేరు నందన
ఏటి పడవలకి కాపలాలేను కాని
చేపలా యీదుతాను నేను

గుడుసుళ్ళ పోయేయేరుకు తప్ప
గుడిలో నవ్వేనాన్నకు తప్ప

నే నెవరికీ లేను
ఎవరికీ ఏమీ కాను

మాలలల్లు కోవటం కొంచెమైనా చేతకాదు
కబరి నీలాలలో రాలినపూలు మాత్రమె నిలుచు

దిక్కుతోచక - దిక్కు చచ్చిన
నాలోని దిగుళ్ళు

అవే నా కళ్ళు

మెడలో హారాలుగా నిలుస్తాయి
కుండపోతగా మారిన బ్రతుకుని
నీపాదాల ముోల క్రుమ్మరిస్తాయి

లోకనుల యీజంట
కొండవాగుల వెంట
ఎండుటాకుల వెంట
నిండు వెన్నెల పంట

కాంతిని కరిగించి
చీకటిని మరిగించి
దిగులు నంతా దించి

పైరు గాలిలో తలనూపే గడ్డిపూవును నేను
పరవశించే గుడ్డిపూవును నేను

అందుకే మా ఊరు స్యందన
అందుకే మాయేయ స్పందన
ఎప్పటికీ నా పేరు నందన

# ఎప్పుడో చిన్నప్పుడు

వెన్నెలపడవల్లో : వెదురు పొదల్లో : వెనక జన్మబొమ్మల్లా తిరిగిన రోజులు
కన్నుల్లో : మిన్నుల్లో తప్ప : నిశ్శబ్దంపైన సంతకం చేయని రోజులు

అట్లతద్ది ఉయ్యాలలుగా ఆకాశం చేరిన వాళ్ళం
గట్లమీద : మెట్లమీద : కైలాసపు గుడిదేవర గడపమీద దీపాలై వెలిగినవాళ్ళం

భ్రుకుటిలో పుండ్రేక్షు కోదండాన్ని విరిచిన శివుని శూలాలం
చకిత చంచల చారునేత్రాల్ విప్పిచూచే వెట్టిపూలం

ముసిరే చీకటి పొలిమేరల్లో విసిరేసిన నక్షత్రాలం
దిసమొల గోసాయిలుండు ఊరవలి సత్రాలం

వేణువు లూదాం : తాటాకు బూర లూదాం
ఏటిలో పడవలు : నీటిలో గడపలు : మా బ్రతుకులెవరో కట్టిన ముడుపులు

రెమ్మపూలనించి తమ్మిపూలవరకు దండలు గ్రుచ్చి
గుళ్ళోనించి బళ్ళోవరకు మెళ్ళోనే వుంచేవాళ్ళం

లంకలో బూరుగుచెట్టు మహాబోధి
ఇసుకతిన్నెల పట్టున మా బ్రతుకొక మహాంభోధి

బడిపుస్తకాల్ని చించి కాగితపు కత్తిపడవలు కైలాసానికి పంపిన రోజులు
గుడి తలుపుల్ని తెరవకుండానే అమ్మ ఒడిలో ఆడుకొన్న రోజులు

అన్నింటికీ మొదలేసి—కొన్నింటినైనా చివరచూడని మత్తు వయసు : గమ్మత్తు
వయసు
ఇన్నిబాధల్లో—కొన్నింటినైనా చవిచూడని మెత్తని మనసు ఉవ్వెత్తున ఎగసే
వయసు

దివి భువిపై నిలుపుకొన్న సుందరతర విశ్వాసాలము
భువి దివితో కలుపుకొన్న సురభిళాత్త నిశ్వాసాలము

మా ఊరి తోటలో విరిసిన సౌంగధిల సుమ మనోజ్ఞ స్వప్నాలము
మా ఏటి అంచున కురిసిన అప్సరోంగనా ప్రవాస విధుర బాష్పాలము

బృందావన కదంబ విటపిచ్ఛాయలలో జాలిపాటల మోహన వంశికలు మేము
యామునాపగ సైకతస్థలులలో వ్రజరాజు నెడదలో రాధ చెప్పిన రహస్యాంశ
ములు మేము

ఎప్పుడో చిన్నప్పుడు : ఎదదలో మధురోహ లున్నప్పుడు
ఎప్పుడో చిన్నప్పుడు : శైలరాజనతయా స్తన దుగ్ధములాని నప్పుడు

పశుపతిప్రక్క : నిస్తుంద గణపతులము మేము
పన్నగ భూషణుని అంశలము : పాములతో ఆడాము

ఎక్కడో పారేసుకొన్న బాల్యాన్ని ఎన్నిసార్లో రమ్మని పిలిచాను
ఒక్క యీ కోర్కె వదలు : స్వర్గమిప్పుడే యిస్తాననె దేవుడు

ఒత్తిగిల్లిన వెన్నెల కాంతి వలిపాలక్రింద
మెత్తగిల్లిన మిన్నులెగయు రసోహాలందున

జన్మమంటూ ఉంటే పాపాలెరుగని పాపాయిగా పుట్టాలని ఉంది
సృష్టిలో ఒంటరితనం తెలీని వటపత్రశాయినై మెట్టాలని ఉంది

శివుని కోసం జపిస్తాను
శైశవం యిమ్మని తపిస్తాను

ఇంతకన్న చక్కని బాధ
ఎప్పుడో కాని మళ్లీ
దొరకదన్న దిగులు
పట్టు తప్పిన నేను
గట్టు తప్పిన నేను.
మెట్టుమెట్టు కొక యాత్రగా
భువినించి, దివిదాక
పొంగి పొంగి ప్రవహిస్తున్నాను.
శ్యామకృష్ణ రజని ముందటి
చివరి వెలుగు
చీకటి కలుగులో దూరినప్పుడు
రూపంలేని నా మనస్సొక
దీపంలేని యిల్లు.
సితారులు, తారలై
తీగలు గలగలలై
కాంతి సంగీతాల మిలమిలలు
ఎవరిదో విస్మృతాత్మ వేదన
తాలూకు
ఏకాంత సంకేతపు
కలకలలు.
మళ్లీ నాచేత గీతం
రాయిస్తున్నాయి
మళ్లీ నాచేత గీతం
పాడిస్తున్నాయి.

# ఆనందం నాకేసి చూస్తున్నప్పుడు

ఆనందం
గుండెముందు కూర్చొని
నాకేసే చూస్తున్నప్పుడు
సముద్రం నన్ను మింగేయాలని
బారలు చాస్తున్నప్పుడు
వెన్నెల మూతికి పులుముకొని
పూలన్నీ దూరపుకొమ్మలమీద
పుణ్యం ప్రోవు పడ్డట్లు
అమృతం ఆలస్యంగా కురుస్తున్నట్లు
ఓరగా, ఒయ్యారంగా నవ్వులొలికినప్పుడు.
నా వెళ్ళిపోయేవేళ చేరువైంది.
నా చివరిమజిలీ వచ్చేసింది
మీకు కావలసిం దిచ్చిన నాకు
నాకేమీవద్దని అడిగే రోజొచ్చింది.
ఎందరికో వీడ్కోలుపులిచ్చిన నేను
ఒంటరిగా వెళ్ళిపోయే రోజొచ్చింది.
బరువులు - బాధలు కొమ్మలు
విరిగి చెట్లుగా నాముందు నిలుచున్నాయి.

# జ్ఞాపకం అంటుకున్న ఆకాశం

ఎవరిదో జ్ఞాపకం
        అంటుకొని
ఆకాశం ఎఱ్ఱపడింది
నీటిపైన, తోటపైన
పూలపైన, పుప్పొడిపైన
తేనెపైన, తేటిపైన
ఒకటే ఎఱ్ఱదనం.

ఎఱ్ఱదనం కుఱ్ఱతనంలా
నేలనించి నింగివరకు
గంతు లేస్తోంది.

రాగంతో దహించుకొని, రాలిపోయే
నిశ్శబ్ద ఆత్మలు— యీ పూలు
విడుస్తున్నయ్.

నీలినీలి వాసనల్ని
జాలిజాలి జ్ఞాపకాల కూర్పుల్ని
భరించలేని స్వర్గంపైన తీర్పుల్ని.

మనసు కారిడర్లలో
పెదవిని నొక్కిపెట్టి, వెక్కివెక్కి యేడుస్తూ

వెళ్ళిపోయే ఎవరి పాదాలక్రిందనో
పడి నలిగిపోతున్న పువ్వుల సవ్వడి.

ఆగిఆగి మ్రోగే
సితారు తీగతెగి—
గతితప్పిన శ్రుతి గంతులువేసినట్లు
గుండె జివ్వుమనేలా
కెవ్వున ఎవరిదోనవ్వు
దానివెనుక ఎన్నో
చీకటి సాయంత్రాల నుర్వ్వు
విషాదాల పర్వ్వు.

బరువైన ఏకాంతంపైన
కరువులా కమ్మింది చీకటి
రెక్కవిచ్చి
చెరువులోని కొంగ ఎగిరిపోతూ
మేడపైన కిటికీరెక్కలకి చక్కలిగింత పెడుతోంది.

కావాలని మర్చిపోయిన ఎవరో
ఇన్నాళ్ళకి— డెందం మూగవోయినా
కాలి అందెలతో మనసుకింద పలకరిస్తున్నారు!
గతంనుండి దిగివస్తున్నారు.

వీళ్లంతా
బ్రతుకు కాన్వాసుపై
కోర్కెలరంగుల్ని కొత్తకొత్తగా పూస్తున్నారు.

ఇప్పుడే నీవునీవుకాదని చెప్పేస్తున్నారు.
జాణలువీళ్లు
వీణలు పలికినట్లు నవ్వులు ఒలికిస్తున్నారు.

వీళ్లంతా
వసంతాలవాడలో
వెన్నెలమేడలో
జనసాంతర సౌహార్దాల నీడలు
చెప్పలేక మిగిలిపోయిన
ఆనందచేతనలోని
అంతస్సౌందర్య సీమలు.

వీళ్లంతా
జిలుగుకుచ్చు జ్ఞాపకాల వెన్నెల చిగుళ్లు
చెప్పలేని ఆర్ద్రత నిండిన వెలుగులు
దివినుండి సెలవడిగి
నేలపై నానెలవడిగి
వెతుక్కుంటూ వచ్చారు
మంచులాంటి మంచితనంలో తడిసి
దినాంత ఏకాంత సాయంత్రంలో విడిసి
గడుసుతనం, పడుచుతనం కలిపి త్రాగి
మసక మసక జ్ఞాపకాల పంకాల్నిలాగి
వగరు, వయ్యారం, ఒలికి వట్టివేళ్ల అత్తరులా
చిలిపితనం చిలికి
బంగారంలాంటి ఏకాంతమునిని
కంగారు పెట్టేస్తున్నారు ?
యంత్రంలాంటి జీవితానికి మిగిలిన
సాయంత్రపు ఏకాంతానికి
చెల్లు చీటీ రాసేస్తున్నారు ?

# క్షణాల కాటుక రెప్పలపైన నడచిరా

నిశిలాగ
నిశ్శబ్దంలాగ—
క్షణాల కాటుక రెప్పలపైన నడిచిరా.

ఆశలాగ
ఆసరాలాగ
జ్ఞాపకాల కన్నీటిని తుడుచుకురా

కలలాగ
కన్నీళ్ళలాగ
ఒంటరి తనాన్ని తెంచుకురా.

కతలాగ
కలతలాగ
నిరీక్షణల రెక్కల మీద నిలిచిరా

వెతలోంచీ—
వెలితిలోంచీ—
తెరిపిలేని మెరుపులా తేలిరా.

నీకోసం
విడిచిన కన్నీటి క్షణాలు
నీకోసం కట్టుకొన్న జ్ఞాపకాల మేడలు
అన్నిటినీ కప్పేస్తూ

ఎడబాటు చీకటులు
ముసరకముందే
రా—
నాలోకి.

వేయిరేకులై విరిసిన
ఏకాంత పద్మంలాగ
నా ఒంటరిపాటుని తాగేసి
బలిసిన అమృత కిరణుడిలాగ
రా—
ఈ సంజవేళ.

# ఎవ్వరున్నారు నాకు?

ఈ సెలయేటి తరగ నురగల్ని
బరువు గుండె గుమ్మానికి
తోరణాలుగా వేసుకొని—

నిశ్శబ్దం కురిసిన, నిరీక్షణలు పరచిన
ఈ నిరీహతను తొలగించేందుకు
ఎవ్వరున్నారు నాకు ?

ఇంత తోట విరియ బూచి, కలయ వేసే
సుమనస్ స్వప్న సురభిళాల వెంట
పరుగెత్తి, పరుగెత్తి,

ఏదో తెలీని జాలి పాటలో
చెప్పలేని మరపు నీలి ముసుగులో

అవశ విస్మృతిని పొందిన

నా యీ అవ్యక్త అంతర్లీన వేదనా మనస్వితను
తొలగించి, బరువుదించే వాళ్ల
ఎవ్వరున్నారు నాకు ?

# తాండవహేల

ఓ జగత్పరిపాల !
ఓహో ! మహాకాల !

నిగమాంతరిత హేల !
సర్గాంత కృతఖేల !

పాహి పరమేశ్వరా ! పాహి జగదీశ్వరా !

శ్రీమంజు మంజీర స్నిగ్ధ కిణుకిణు రవము
యీ మంచు మలపైన నేమి శబ్దించినది !

నిశలన్ని హుంకారశబ్ద సంభృతమగుచు
దిశలన్ని ఓంకార ముఖరితములై పోవ

నందిచూపులు శివుని పదసంగతుల గదుర
శివదృష్టినంది హృన్మందిరమ్మున దిరుగ

మార్దంగయుగళమ్ము మహిత రీతిని మ్రోగె

నంది కన్నులు చెమ్మగిల్లినవి ఒకవంక
తనను తానే నమ్మలేని తన మబ్బినది

ఒక మృదంగము : నందిచేత నినదించినది
ఒక హృదంగము : శివునిచేత శబ్దించినది

నర్గాంతమగువేళ జంట మద్దెల మ్రోత
స్వర్గాంతమున సుపర్వులు శిరమ్ములువంచి
హర్షాశ్రుపూరమ్ము లొలికించిరింపుగా

శ్రీ మహాదేవ పదసంఘట్టనల నలిగి
ఈశ్వరవిభూతి రోదోంతరమ్మున దిరిగె

కైలాసవిభు మహాకరముద్రికల దగిలి
వెన్నెలలు భ్రమసిపడి అమృతము లుమిసినవి

కంటి అశ్రులు కపోలమ్ముపై జాల్వార
ఆత్మలోతుల పొంగి అందగించెను గంగ

ఒక యెక్కడో గుండె లోయలో నారసికొని
ప్రథిత పంచాక్షరీ ప్రస్తారమిరవుకొన

పద్మనాభుడు మృడుని పాదపీఠిని వ్రాలె
జలజాత భవుడంత సాగిలంపడె నచట

పొంచుమబ్బులు తెరలు పొటమరించిన త్రోవ
మంచుగుబ్బలి రంగ మంటపమ్మయిపోవ

దీపికలు - వెన్నెలలు - తివిరిపిండిన కాంతి
తమయంతగా వెలిగె తారకానివహములు

పలకరించిన శివుని అరకంటిపాపతో
పులకలెత్తిన మోడుచెట్లు పూచెను పూలు

ప్రతి సంజెలందు తాండవమాడ రుద్రుండు
గతి తప్పకను సర్వ బ్రహ్మాండములు నిలుచు

లయతప్పెనా - భువికి లయ మప్పుడే సోకు
దయ తప్పెనా - దివికి క్షయ మప్పుడే ప్రాకు

చిరుగజ్జె మ్రోగినా - చిర్నగవు చిందినా
ఉమకంటి తుదినుండి ఊర్పు సందడి నిల్పు

పైట చెరగది కదలి భవుని కన్నుల గప్పు

జాట జూటాటవీస్థగిత చంద్రుని సౌరు
భసితత్రిపుండ్రాంక ఫాలమ్ముపై జారు

ఓయీ ! మహాదేవ ! ఓ ఆదిభిక్షూ !
ఓయి ! కంతేకాల ! ఓ జగచ్చక్షూ !

మృత్యుంజయా ! పాహి ! మృత్యుంజయా
నృత్యంకరా ! ప్రమథగణ కింకరా !

ధగధగద్ధగిత రోచిర్నివహదామములు
చకచకచ్చకిత దీధితులొప్ప సాంద్రముగ

ఒక కోటికోట్ల పుణ్యములుబ్బి మబ్బులయి
ఒక యెన్ని జన్మలో ఒదిగి నేడయినట్లు

కలలు పరచినయటుల - క
న్నులరవిచ్చినటు - సెలయేటి క
న్నె లందము పొంగ నవ్వినిటు - వె
న్నెలల వాకలయి - విపిన వీథిక తడిసె

నటరాజ తాండవ మహంబింత చూచితే !
నిటలాక్షు నాట్య సంభ్రమ మింత చూచితే !

పటు రోషనయన రోచిః పటల మల్లుకొనె
చటులాక్షి క్రోధ సందీప్తి సంధ్యారాగ
పటలిగా - సర్వ హరిదంతములు పర్వినది

మబ్బు కన్నెలు మౌన శంఖములు మొరసినటు
ఎటుల బారులుతీరి ఎగసి తిరుగాడెనో !

నటరాజ తాండవ మహంబింత చూచితే !
నిటలాక్షు నాట్య సంభ్రమమింత చూచితే !

ఎందుకై కురియదే ! కనుల నమృత మిపుడు
కందోవను విరియవే ! కల్హార మాలికలు

డెందమది - పూయదే ! అరవింద మటు నీకు
స్పందమది మ్రోయదే ! స్వర్గ సంగీతమటు

శివ మహాప్రభునాట్య సమయ సజ్జితరీతి
భవ మహావిభు ప్రసాధన పరాపద్ధతిని

నిటలాక్షికను గప్పు నిడుద కుంకుమబొట్టు
కటిపైన గజచర్మ, వ్యాఘ్రాజినమ్ములు

ఉరముపై నొరయు వాసుకి కంఠహారమ్ము
మొల తోలుపై పునుకపేరు లమరించుకొని

జలతారునును సంజె కాంతి కన్నుల దిద్ది
నవనవోత్ఫుల్ల కాంచన కోరకములౌచు

ఉడువీధి తారకలు ఊగె హారములౌచు
కన్పట్టు దశదిశల్ కట్టు పుట్టములాయె

మొనబిట్టు వాడి ముమ్మొన చేతిపనిముట్టు
సర్వ సౌపర్వ సంతతి - సమాదృత రీతి ఒప్పగా
దేవదేవుని కలంకారముల దీరుతురు

అవతంస కుసుమమై అమృతాంశుకళ యొప్ప
కలుష హారిణి గంగ కదలాడె జటలలో
ఢమరు మ్రోగెను మహాతంత్రముగ వెనువెంట

అనిలింపులు - నిశాచరులు - నిస్తుల జగము
ప్రాణానిలమ్ము లొక్కట బిగ్గ బట్టుకొని

ఆనందమవధి దాటిన అంబుధిగ పర్వ
సర్వామర శ్రేణి సాగిలం పడిమ్రొక్క

పర్వేరక్షో గణము బంధరమ్ముల పగిది
శర్వుని మహాపద్మసం నిభ పదాంకమున

మిన్నుల మేఘ పరంపర విరిసెను
కన్నుల నానందాశ్రులు కురిసెను

సురసరిత్తున అలల స్వరమరుత్తులు సాగె
స్వరమరుత్తులుసోకి ఎద గరుత్తతి మొలిచె

ఎదపదంపడి విహాయసవీధి విహరించె
సర్వసృష్టియు మహాశివదృష్టి తానాయె

భాస్వత్త్రి నేత్ర బంధురరోచిజాల మది
లోయెడద వెలుగులై లోనగుడుసుళ్ళాచు

బ్రహ్మవిష్ణువు నింద్రపారిషద లోకమ్ము
అష్టమూర్తికి మహాసృష్టి మూర్తికి తనకు
విహ్వలిత స్వాంతులై వినతులైరట తుదకు

నటరాజ తాండవమహంబింత కనుటకై
ఎటుల సాగిలపడ్డదో సృష్టి సర్వమును

భద్రమగు భావమ్ము పర్వె కన్నులలోన
భావపరిపుష్టికై పాణిముద్రిక పట్టె

పాదన్యాసములందు పరువెత్తె తాళలయ
సర్వదేహము శివము సాత్త్వికము తానాయె

పరశివ మహానంత అభినయ మహమ్మందు
ఒక మహాస్పంద సందోహమ్ము విడిదిగా
ఒక మహానంద సందోహమ్ము ఎడదలో

నటరాజ తాండవ మహంబింత కనుటకై
ఎటులసాగిలపడ్డదో సృష్టిసర్వమును

ఇవె ! బిల్వపత్రములు ! శర్వునకు పాత్రములు
ఇవెచూడు ! సురపొన్న లేమిటికి నిలిచినవి

ఇవెచూడు ! మల్లికలు ఏల కనువిచ్చినవి
ఇవె ! వకుళ నికరములు ఏమంచు పిల్చెడిని ?

ఆశాంతముల సర్వజంతు సంతానములు
ఆశాధ్వనీనమ్ములైన అక్షులతోడ
అరవంచు మోముతో - అరదించు కనులతో
పరతెంచు శర్వుని మహానంద సన్నిధికి

ఏలా ! మహాకాల !
ప్రళయాంత కృత్కేల !
ఏలా ! దిశాచేల !
నయనాంత కృతహేల !

డమరు ఢక్కా మురజ తాళగతులను వదలి - సం
భ్రమత్ భ్రమితవల్గన పాదన్యాసముల - ఆ
వమత్ అగ్ని కందర - మహానేత్రముల
విసపురోచులు వీచి దిసలు భస్మములాయె
ముసిరె రోదసిలోన - ముగియు సృష్టికి నాంది

ఓయి ! పరమేశ్వరా !
ఓయి ! జగదీశ్వరా !

ఊహ సల్పితివంటె ఉద్భవించును జగము
ఊర్పు విడిచితివంటె ఊగె నీ గగనమ్ము
కరుణ దాల్చితివంటె కడతేరు భువనమ్ము
అరుణలోచనమందె అంతరించును సృష్టి

పటలీకృతాశాంత భేరి భాంకృతులతో
నిటలాక్షి రోచిరుద్గత నిబిడ కీలికలు —

చటుల త్రిశూల వల్గన సాంద్రదీధితులు
పటుతరోజ్జ్వల నాగబంధములు అసియాడ

కటిపైన గజచర్మ కౌపీన మింపెసఁగ
భస్మత్రి పుండ్రాంక ఫాలభాగము తోడ

జటపైన శశిరేఖ సవదరించిన తీరు
జూటాగ్ర మందాకినీ శుభ్ర నీరములు
సతతాభిషేక సాంద్రములౌచు వాల్వార

నటరాజ తాండవ మహంబింత కనుటకై
ఎటుల సాగిలపడ్డదో సృష్టి సర్వమును !

గగనమున శశిరేఖ కంచు అద్దము కాగ
భుగభుగని వెలుగు సూర్యుడు తామ్ర ముకురముగ

అక్షులార్పక చూచు హైమవతి మోమొకటి

పట్టు వలువలుదాల్చు పట్టులం దొక్కటి
బిట్టు మ్రోగెడి గజ్జె కట్టుకొను తళియొకటి
బొట్టొకటి నిటలమున బొల్పుగా నిల్పు తటి

ఇన్ని తద్దయు తనకు చిన్ని అద్దములైన
ఎన్ని లోకము లొకటియై తన్ను జూపించు ?

నటరాజ తాండవ మహంబింత కనుటకై
ఎటుల సాగిల పడ్డదో సృష్టి సర్వమును!

మైపూత నలఁదికొని మంచి గంధమంసంత
పుష్పాదుల పరచుకొని పుణ్యదేహమునింద

ఉమ కనుల నొకసారి తను జూచుకొనిగాని
భ్రమ దీర్చుకొనలేని పరమ సౌందర్యమ్ము

శర్వాణి పాద మంజీరముల మ్రోతవని
శర్వునికి కాలిగజ్జెలు ఘలంఘల లగును

కనుల భ్రమరపు జంట కదలాడి తనవెంట
చినుకు చినుకుగ సిగ్గు రోమాంచముగ మార

వారించు పార్వతి పాణికంకణ రవము
సారించినను - విని - శివుని డమరుక మ్రోగు

సురసాత్త్ర సుమమృదుల సురభిళమ్ములు కొన్ని
లేలిహానపు బుసల లీలఁదోచును కొన్ని

పునుక ఎమ్ముకలదూరి బుడుబుడులుమను కొన్ని
నవనవారంభ వర్షాగర్జితము కొన్ని

ఉమ గండపూతలను ఇంకించునవి కొన్ని
పక్ష్మంచలపు కవాటముల దగ్గర దూరి

నయన ఘంటాపథము మూయించునవి కొన్ని
గౌరాంగముల ప్రాకి గమకించునవి కొన్ని

సురసరిత్తున అలల కోడె త్రాచులు కొన్ని
శర్వాణి వక్షమును దూరు పాపలు కొన్ని

వెస మబ్బుగములగుచు దిసల పర్వును కొన్ని
వసివాడు నూర్పులివి ముసరుకొనె కసటులయి

ఓహో మహారుద్ర ! ఓ జగత్ భద్ర !
ఓహో మహాస్థాణు ! ఓ జగత్ ప్రాణ !
ఓయి విశ్వంభరా ! ఓయి జాలంధరా !
ఓయి త్ర్యంబక మహామృత్యుంజయా ! స్వామి !

బీరెండలుమిసి పింపిరి వోవునవి కొన్ని
జారు మబ్బులు కనుల సిరిగంధములు పలికినవి

పాటీర పంకమ్ము నింకించునవి కొన్ని
నీటి యంచులనెల్ల నిగదితము లొక కొన్ని

శివజటా కోటీర సీమ ధ్వజములు కొన్ని
నవనవేళా సప్తజిహ్వా మంత్రములన్ని

బిసరుహాసను రాణి వీణ తంత్రులు కొన్ని
లక్ష్మి పదాంభోజ మంజీరములు కొన్ని

కస్తూరికా నిటల కమల నాభుని హృదయ
విస్తారమును కొలుచుకొని పోవు నొక కొన్ని

ఎల నవ్వులో స్వామి ఏమిటో అయిపోవు
తెలి నవ్వులో స్వామి తిరిగి తానయి పోయి

పొల పొలని ఒక నగవు పోహళించెడి వేళ
మినువాక మొగముపై మిసిమి వెన్నెల లగును
కనుదించు కళ్యాణి కంఠహారములగును

తెలినవ్వు ! వలినవ్వు ! జిలుగు వెన్నెల పర్వు !
కిలకిలని ఒక నగవు - కలకలని ఒక నగవు

జలజలని ఒక నగవు - జలతారు కాంతిగమి
సలసలని ఒక నగవు - కలనాదములు పోవు

ఏమి విశ్వంభరుని హేలా విలాసమిది !
ఏమి సర్వంభరుని ఖేలా కలాప మిది !

ఇరవుకొని గుండెలో నెగసిపోవును సుమ్మి !
బరువుకొను పుండ్రేక్షు కోదండ గుణితములు!

కంటి బొమ పుండ్రేక్షు కదన కౌశల ధనువు
కంటి బొమ ఒక పరిని - యమపాశమగు తాను

ఓంకారముగ నగును ఒక్కపరి కనుబొమలు
హుంకారముల విసము లుమియు నొకచో మరల

వికటాట్టహాస విభ్రమ విలాసమ్ములో
భ్రుకుటి కుంచితమైన - భువన బ్రహ్మాండములు

దిగులుపడి దిర్దిరని తిరుగునాసలు వీడి

పక్ష్మాంచలమ్ములను పదును చూపులు కదలి
నాసమున - హాసమున - ఉరముపై - బుజముపై
ఉదరమున - కటిపైన ఊరువుల - దిగజారి
కాల నాగులవోలె - కైలాసమున ఆడు

కైలాసమున నుండి కాంతి బాణము లగుచు
గగనమున కలదిరుగు - జగములోపల జరుగు

నటరాజ తాండవ మహాంబింత కనుటకై
ఎటుల సాగిలపడ్డదో సృష్టి సర్వమును !

హస్త ముద్రికపట్టి ధ్వస్తకాముడు నిలిచె
అస్తమిత సూర్య సందీప్తి అక్షులమెరయ

ఒకసారి తనచేయి ఒనరె త్రిశూలమై
ఒకసారి తనపాణి ఊర్జితపినాకమై

ఒకసారి ఢమరుకలు ఓహరించిన పగిది
ఒకసారి కాలపాశపు ఉచ్చువలె నొచు

చకచకల నొకమారు సారసమ్మగు తాను
రకరకములగు భావరక్తిమకు బొమ్మలై

తన తనువు ధనువుగా ఆనమించిన యపుడు
తన కరము - ఒక శరము పగిదిగా నయిపోవు

యుగధారిగా తానె ఒదిగిపోయిన యపుడు
నిగమాంత వీధికల నిలుచు పాణిద్వయము

నటరాజ తాండవ మహంబింత కనుటకై
ఎటుల సాగిల పడ్డదో సృష్టి సర్వమును!

తులకించు పిననవ్వు తూర్పు పెద వెలిగించె
తిలకమ్ము నుదుటిపై దివ్యజ్యోతిగ వెలిగె

చిలికించు కంటితుది చేవచూపులు కొన్ని
మలుపు తిరుగుచుపోయి మంచుమల నెగసినవి

జలదాంత చంద్రరేఖలవోలె విరిసినవి
కలహైమవతి నూపురారణితములు కొన్ని

కలశింజినీ మంజుక్రమకాంతులు కొన్ని

ఏమి అభినవ మహము! ఏమి అభినయ మహము!
ఏమి వైభవమిచట! ఎంత ప్రాభవ మిచట!

కలనాదములు తూర్యపున్నినాదములివ్వి
కలకంఠ నిర్గత వచోగుంభనము లివ్వి

ఒక్క మాహేశ్వరాంఘ్రిని చుట్టియున్నయవి
ప్రక్క మాహేశ్వరీపాదముల చుట్టుకొన్నయవి

కన్నుగవలో పరచు వెన్నెలల వంటివివి
వెన్నెలలలో నమృతగంధవహములు కొన్ని

గంధవహముల గుండెలోని కల లొక కొన్ని
ఇంధనములై — ఆత్మబంధనములై — భుజ
స్కంధముల దీప్తులెగబోసి సాగును కొన్ని

ఏమినవ్వులు ! రసానందకందము లివ్వి

ఏమి అభినవ మహము ! ఏమి అభినయ మహము !
ఏమి వైభవమిచట ! ఎంత ప్రాభవమిచట

ఒకట కిన్నరకోటి—ఒకట ఖేచరధాటి
ఒకట జక్కులపాట - ఒకట మక్కువపాట

ఒకట కింపురుష లింపొలుక సహనాట్యమ్ము
ఒకట గంధర్వతతి—కలమధుర నాదమ్ము

ప్రమథగణ మంత - మార్దంగికులు— వైణికులు

ఒకట స్వరసంతతిని సవదరించును లక్ష్మి
ఒకట వరవల్లకిని జలదరించును బ్రాహ్మి

ఒకట లలితా పరాభట్టారికయు దాను
ప్రకట పాటల పల్లవాధరము లింపొలుక
రణితములు గీతములు రమణ నాలాపించు

భణితములు చేతములు ఈశానపరములుగ
శాంభవీ సర్వమంగళ శాంత వదనమున

బంభరాయతలోచనాపాంగ దృక్తతిని
ఈశుడొకబో నేమొ చిన్న సంజ్ఞలు చేయ

ఏమి అభినవ మహము ! ఏమి అభినయ మహము !
ఏమి వైభవమిచట ! ఎంత ప్రాభవ మిచట !

పరశివా భవ్య భట్టారికకు కనులలో
మరల తాండవ మూర్తు లిరవుకొన భరమౌచు

కనుపాప దించుకొనె-కన్నీరు నించుకొనె
మినువాకతోపొత్తు-మిసిమి చెక్కులజారె

భవునకిట పాదగతి బలుపోకడలు పోయె
లోచనాంత ప్రశాంతలోల దృక్కులుపోయి

శర్వాణి కన్నులకు చకిలిగింతలు పెట్టె
ఉమమనసు లోతులో ఊరటను కలిగించె

తనదు వామార్థమే తంద్రముగ పరశివుడు
పరిసించితాపాంగ భద్రవపువును గాంచి

రోమాంచమయి తనదు లోలదృష్టులలోన
అద్వైత భావాంబరానంద యాత్రయై

ఏమి అభినయ మహము! ఏమి అభినవ మహము!
ఏమి ప్రాభవమిచట! ఏమివైభవ మిచట!

కలిత లలితానంత కాలవేదికపైన
కలియద్రిప్పిరి సురలు క్రపంపు టారతులు

కాలమే ఒక దివ్య గ్రైవేయహారమయి
కాలమే ఒకతూరి కంధరాఘోషమయి

కాలమే ఒకసారి కదలు నాకాశమయి
కాలమే ఒకమేరలేని కైలాసమయి

కాలమే పరశివుని కంటిమంటగ నగును
సంజెలందున మలుపుతిరిగి సాగెడి దగుచు

శింజినీరుతివోలె జిలుగు మ్రోతలువోవు
మేదురాంబరవీథి మిగులు కాలపు నలుపు

నీడయా నిర్భరాశ్వాస కలభములగుచు
మీద నురిమెను మొయిలు—మేదిని వడంకగా

ఏమి అభినయ మహము! ఏమి అభినవ మహము!
ఏమి ప్రాభవమిచట! ఏమి వైభవమిచట!

సంధ్యానటారుణ జటాకిసలయపు రుచులు
వింధ్యమ్ముపై ప్రాకె వినువీథి యెదతాకె

కాలమే ఒక మహాకాంతి యవనిక అచట
కాలుడే ఒక మహాఖండ తాండవమూర్తి

ఒకమహా నీలాంబుధర మొదిగి కలభమై
నికటమున కుంభశీర్షమునుండి కురియించె

పర్వుపర్వున వచ్చి పలుగతుల నర్తించి
శర్వునికి అభిషేక శ్రీమహావార్నిధిని

అగ్నిభట్టారకుడు, అవనత శిరస్కుడై
భుగ్నభావముతోడ భువియంత తానుగా

నిటల ఘటితాంజలిగ—నిలిపెనీరాజనము
పుడమి చందనచర్చ—పుణ్యవపువున నిలిపె

అనిలమది కాలంపు ప్రాణమై హరునెదుట
వింజామరలు పట్టి—వినతి సూపించినది

అనలమది—కాలంపు తేజమై భవునెదుట
దిక్కులన్నిటి దెచ్చి ప్రక్కనే నిలిపినది

ఆకాశమది మహాకాల భవ్యాంఘ్రులను
రాకానిశారోచి రుద్గతముగా జేసె

ఓస్వామి ! ఓస్వామి ! సంధ్యానటా !
భాస్వన్మహాశీర్ష బంధురజటా !

కాలంపు మదతలో కదలాడు చీకటులు
కాలంపు నదతలో మెదలాడు కాంతిగమి

కాలంపు గడుసు పోకదలోన ప్రాణులవి
కలరుతుల కళ్యాణగానమ్ము నొనరించు

జలతరంగిణులొకట గుండెలో మ్రోయించు
ఒక్క నిశ్వాసమది ఒనరె వేదములొౌచు

ఒక్క నిశ్వాసమది ఉరలె సంగీతమయి

ఒకకాలి గజ్జె గుండియ విచ్చి నవ్వగా
పకపకని లోకసాక్షికి నవ్వుతెర వచ్చె

ఒక డమరుమ్రోతలో ఓంకారములు తెరలి
నిగమాంత వీధికలు నిరుపమములై వెలిగె

ఓస్వామి ! ఓస్వామి ! సంధ్యానటా !
భాస్వన్మహా శీర్ష బంధురజటా !

మాయూర పించములు మహితేంద్ర ధనువులై
మాయూఖ శింజినలు మనసొప్ప మ్రోగినవి

సిత చాంద్రికితగీతి చిన్ని పులుగులు పాడ
తత తంద్ర నీలాంబుధరము లుద్ఘోషింప

వితత విభ్రమ విజిత విషమలోచన పంక్తి
ప్రాతరుద్యత భాను బింబదీప్తి ఘటించె

ప్రాణంపు త్రిశిఖివలె పరిఢవిల్లెను అంత
స్థాణురూప మ్మొకటి—అణురూపమింకొకటి

ప్రాణరూపమ్మొకటి—ప్రకృతి రూపింకొకటి
లోవెల్గులవియన్ని—ప్రావెల్గు దీపములు

జారు వెలుగులు కొన్ని—సంజె జిలుగులు కొన్ని
నీలు వెలుగులు కొన్ని—నిభృతదీప్తులు కొన్ని

పారువెన్నెలపుల్గు- పక్షముల రెపరెపలు
మీరుసంజెల వెల్గు -మిసమిసలు ఒకకొన్ని

ఏమి అభినయ మహము! ఏమి అభినవ మహము
ఏమి ప్రాభవమిచట! ఏమి వైభవమిచట!

ఓస్వామి! ఓస్వామి! సంధ్యానటా!
భాస్వన్మహా శీర్ష బంధురజటా!

కాలంపు తునకలను కదలఁబంపెడు నటన
నీలంపు గగనాన నింపు వెన్నెల నటన

పుడమి గుండియలోతు పులకరించెడి నటన
కాలదండముతోడ సృష్టిగతి శాసించి

లోల దృష్టులతోడ లోకగతి నియమించి
ఈమంచు మసకవెన్నెల పూలపూయించి

రేవెలఁది మెయికి చీకటివల్వ కట్టించి
నీవు-నేను-రెండు-తనలోనె కలియగా

సాగుచుండెడి మహాసర్గ మాతని మహిమ
తెలినవ్వు చలువలవి—తెలిమబ్బు వలువలయి

కలలొౌచు పర్వి—దిక్కులనిండ విడిసినవి

ఏమి అభినయమహము ! ఏమి అభినవ మహము !
ఏమి ప్రాభవమిచట ! ఏమి వైభవమిచట !

ఓస్వామి ! ఓస్వామి ! సంధ్యానటా !
భాస్వన్మహో శీర్ష బంధురజటా !

పట్టుకుచ్చుల జటలు పైపైకి ఎగసిపడె
బిట్టు ముమ్మెనవాలు ప్రిదిలించె దిక్కులను

కట్టుపుట్టము కాలిగతులతో నడయాడ
చెట్టుపయి పిట్టలవి - చిన్ని కన్నుల నిండ

కట్టుకొన్నవి కలల బంగారు మేడలను
పట్టుకొన్నవి సృష్టి భద్ర రాహస్యమును

కొట్టుకొను ప్రాణంపు గూటిలో దీపమయి
నట్టనడి సంద్రాన నర్తించు నౌకయయి

సృష్టి పరమేశ్వర విలాసమయి భాసించె
దృష్టి పరమేశ్వరి కలాపమయి హసియించె

కొస చూపులో స్వామి కొసరి స్వర్గము పంచె
రసరూపమున దేవి అమృతము ప్రసరించె

ఏమి అభినయ మహము ! ఏమి అభినవ మహము !
ఏమి వైభవమిచట ! ఏమి ప్రాభవ మిచట !

కాలమ్ము అగ్నిగా - దిక్కులవి భగ్నమయి
నీల గగనమ్మంత ధూమరథమై పోయె

రాగమ్ము ఓంకారరవళిగా మారినది
లోకమ్ము మంట విస్తరికాగ మారినది

భోక్తయును, భోజనము, పొలుపొంద తానుగా
రక్తిమయు, రాగమును, ముక్తియును, శక్తియును

సర్వమును తానెగా శర్వుడాడెను నేడు
వేదవేత్తలు ఋషులు - వాద్య వేత్తలు పురుష

లెదనిండ నద్వైత హిందోళరాగమ్ము
లొదిగించుకొని - ప్రణతు లొసరించి నిల్చిరట

ఏమి అభినయ మహము ! ఏమి అభినవ మహము !
ఏమి వైభవమిచట ! ఏమి ప్రాభవమిచట !

జయ ! జయ ! మహాకాల ! సర్వాంతరిత హేల !
జయ ! జయ ! మహాకాల ! స్వర్గాంతరిత ఖేల !

పాహి ! పరమేశ్వరా ! పాహి జగదీశ్వరా !
పాహి ! మృత్యుంజయా ! పాహి ! నృత్యంకరా !

ఉచ్చైస్స్వనమ్ముతో నురలె సురలోకమ్ము
నీదు తాండవమహము నిలుపనోపము మేము

నీ దయావార్నిధిని - నీ హృదయ సన్నిధిని
ఆనందసీమలను అమృత భాండము లొలుకు

ఒక అడుగు కదలినా - ఒక చూపు వదలినా
ఒక సృష్టిసర్వమును - ఒదుగు భస్మమువోలె

అంజలి ఘటించెనట అబ్జనాభుడు తాను
ప్రాంజలి రచించెనట పద్మభవుడును తాను

సర్వలోకము లొక్క - యిల్లై శంకరుడు గృహమేధిగా
సర్వసృష్టియు తనదు ఏల్గడసాగె నమృతాంభోధిగా

ప్రతి సంధ్యాచరణీయ నృత్యకలనా ప్రారంభ సంరంభ - సం
ధృత చర్మాంబర ! భస్మలేపన మహాదీప్తాంగ ! కాపర్దకా
చితచంద్రోజ్జ్వల గాంగనిర్ఝర ! దిశాచేలా ! మహాకాల ! రా
జతశైలాగ్ర నివాస ! మమ్ము దరిచేర్పన్ రమ్ము ! పృథ్వీశ్వరా !

దళితైనః పథముల్ - పునర్భవరుజా దాహంబు - లాశౌఘసం
కుల జంబాలరవిప్రభల్ - నమిత దిక్కుంభీంద్ర తుండాగ్రముల్
జలజాతాసన విష్ణువంద్యములు - రాజన్నవ్య నాట్యక్రియా
కలనా శింజిత మంజుపాదములు - మాకౌగాక పృథ్వీశ్వరా !